బడి యుండెనుగదా. ఈజీవన్ముక్తిదశయందు క్రోధరాహిత్యాది ధర్మములు ఏప్రకారము స్మరింపఁబడుచున్నవి?

సమాధానము—వాస్తవము. కనుకనే జీవన్ముక్తునియందు క్రోధాదు లుండునా యని శంకించుటకు కూడ నవకాశము లేదు. జీవన్ముక్తికి చాల ప్రాచీనకాలముం దనుష్ఠింపఁబడిన వివిదిషాసన్న్యాసమునందే క్రోధాదులు ప్రసక్తములు కాక యుండఁగా సర్వోత్తమదశయైన తత్త్వజ్ఞానదశయందు క్రోధాదు లేప్రకారము సంభవించును! తత్త్వజ్ఞానదశయందే సంభవింపని క్రోధాదులు విద్వత్సన్న్యాసమందుఁగాని జీవన్ముక్తియందుఁగాని బొత్తుగా ప్రసక్తములు కానేరవు కనుక వివిదిషాసన్న్యాసమునం దభ్యసింపఁబడి జీవన్ముక్తిదశయందు అనువర్తించి వచ్చు క్రోధరాహిత్యాదుల నిచ్చట నుదాహరించిన స్మృతి వాక్యముచేత ననువదింపఁబడుచున్నవి గాని విధింపఁబడ లేదు.

కనుక తత్త్వజ్ఞుఁడగు యోగితో లౌకికపురుషున కెప్పటికిని కలహము సంభవింపనేరదు.

నిందింపఁదగిన విషయము యోగియందు లేనందున నిందార్హమయిన విసంవాదము కూడ లౌకికపురుషునకు యోగియందు సంభవించదు

ఈయర్థము కూడ ఒకస్మృతియందుఁ దెలుపఁబడియున్నది.

శ్లో. యన్న సంతం న చాసంతం నాశ్రుతం న బహుశ్రుతం,
న సువృత్తం న దుర్వృత్తం వేద కశ్చిత్స వై యతిః. అ.

తా. ఏపురుషుఁడు మఱియొకపురుషుని ఉత్తమజాతి కలవాఁడనిగాని హీనజాతికలవాఁడని గాని మూర్ఖునిగాఁగాని

పండితునిగాఁగాని మంచియాచారముగలవానిగాఁగాని దురాచారము గలవానిగాఁగాని యెఱుఁగఁడో అట్టిపురుషుఁడే యతి యని జీవన్ముక్తుఁడని చెప్పఁబడును.

అనఁగా అన్యులయందు నీచోత్తమాదిభేదబుద్ధి గలిగి వ్యవహరించువానితో కలహించుట కవకాశము గలిగియుండును. సర్వత్ర సమబుద్ధి గలిగి వ్యవహరించు జీవన్ముక్తపురుషునితో కలహించుట కెవరికి నవకాశము గలుగ దని తాత్పర్యము.

ఇఁకను శాస్త్రజ్ఞుఁడగువాఁడును యోగితో వివాదమును బొందఁడు.

శాస్త్రజ్ఞుఁడు యోగితో శాస్త్రమందు వివాదమును బొందునా? లేక యోగియొక్క చరిత్రమందు వివాదమును బొందునా?

శ్రు. తమేవైకం జానథాత్మానమన్యా వాచో విముంచథ,
నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్.

అనుశ్రుతుల ననుసరించి యోగీశ్వరుఁడు పరశాస్త్రప్రమేయములను దూషింపఁడు గనుక శాస్త్రవేత్తను యోగితో శాస్త్రప్రమేయమందు వివాదము సంభవింపదు. పరశాస్త్రప్రమేయములను దూషించినఁగదా పరశాస్త్రవేత్తలు కలహించుదురు. దృశ్యమానాత్మక ప్రపంచమున కధిష్ఠానమైన యాపరమాత్మ నొకనినే తెలుసుకొనుఁడీ ఇతరమైన వాక్యములను విడువుఁడీ బ్రహ్మజ్ఞానోపయుక్తములు గాని వాక్యముల నన్నిటిని విడువవలయును. ఇతరవాక్యముల నుచ్చరించుట వాగిం

జ్ఞానము ఇవి మొదలయిన గుణములు క్రీడన యంతఃపురము
నాశ్రయించినట్లు యోగీశ్వరుని నాశ్రయించును.

శ్లో. వేశ్యాచారమనుసరం సర్వే వాంఛంతి తం జనాః,
వేణుం మధురనిర్ధ్వానం వనే వనమృగా ఇవ.

టీ. సర్వజనప్రియంకరమైన అనుష్ఠానముచేత నొప్పు
చున్న యాతత్త్వజ్ఞుని సకలజనులు కోరుచుందురు. అనఁగా
వనమందు మధురముగా ధ్వనిచేయుచున్న బొంగువెదురును
విడువఁజాలక వనమృగములు దానిచుట్టు ముట్టుకొని యున్నట్లు
సకలజనులు తత్త్వజ్ఞానియొక్క సద్ధర్మప్రవృత్తిని గాంచి విడువఁ
జాలక వానిని సర్వకాలసర్వావస్థలయందును చుట్టుకొనియుందు
రని భావము.

శ్లో. సుషుప్తవత్సర్వవిశేషభావవర్జితా
స్థితస్సదా జాగ్రతి యస్య చేతనా,
కళాన్వితో విధురివ యస్సదా బుధై
స్సేవ్యతే ముక్త ఇతీహ స స్మృతః.

టీ. ఏపురుషుఁడు జాగ్రదవస్థయందు కూడ సుషుప్తి
దశయందు వలె సమస్తవిషయాకారవృత్తులను విడిచి కేవల
ముగా నున్నచిత్తముతో కూడియుండునో సంపూర్ణకళలు గల
చంద్రుఁడేప్రకారము దేవతలచేత సేవింపఁబడునో యప్రకారమే
పండితులచేత సర్వకాలములయందును నేపురుషుఁడు సేవింపఁ
బడునో, అట్టి పురుషుఁడు ఈలోకములో ముక్తుఁడని చెప్పఁ
బడును.

శ్లో. మానసేన కేవలం హేయాని విషయాణి స్పృశాని చ,
దిక్కాలవిషయా భూతాని సర్వాణి కేవలాని చ.

తా॥ ఈలోకములో సాధువులు కఠినులు కూడ తమ తల్లియందే ప్రకారము విశ్వాసముగలవారై యుందురో యాప్రకారమే తేజముప్రధానముగాఁగల పురుషునియందు సమస్త భూతములు విశ్వాసమును బొందియుండును.

శ్లో॥ తపస్విషు బహుజ్ఞేషు యాజకేషు నృపేషు చ,
బలవత్సు మనుష్యేషు తేజో వాంశేన రాజతే.

తా॥ తపస్సును చేయువారియందు సకలశాస్త్రపాండిత్యము గలవారియందు యాగాదిపుణ్యకార్యములు చేసిన వారియందు మహారాజులయందు బలవంతులయందు సమస్తసద్గుణములు కలవారియందును తేజోగుణము గల పురుషుఁడే యధికముగా ప్రకాశించును.

ఈచెప్పిన ప్రకారము జనస్తుతికి విసంవాదాభావమను మూఁడవప్రయోజనము నిర్బాధముగా కనుపడుచున్నది.

దుఃఖనాశసుఖావిర్భావముల చతుర్థపంచమప్రయోజనములు బ్రహ్మానందగ్రంథములోని విద్యానందమను నాలుగవ యధ్యాయమునందు నిరూపింపఁబడియున్నవి. ఆరెంటిని సంగ్రహముగా నిచట చెప్పెదము.

శ్లో॥ ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమను సంజ్వరేత్.

తా॥ ఏపురుషుఁడు సర్వభూతములయొక్క హృదయములయందుండి అనేకాయాసాదోషరహితుఁడైన ఆత్మను నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడైన పరమాత్మునిగా తెలుసుకొనెనో, ఆ పురుషుఁడు యేప్రయోజనముకొరకు నేఫలమును కోరి శరీర

మూఢవిధములు. హిరణ్యగర్భుఁడు మొదలు స్థావరమువరకుఁ గల సర్వదేహములయందు ననుగతమైన సాక్షిచైతన్యరూపమయిన యీ బ్రహ్మ కలదో అట్టి బ్రహ్మము నేనే యని తెలుసుకొనియున్న పురుషుఁడు స్వదేహమందు వలెనె సర్వదేహములయందును సర్వకామములను సాక్షిగా నుండును.

ఈయభిప్రాయముతోనే శ్రు. 'సోఽశ్నుతే సర్వాన్ కామాన్సహ, బ్రహ్మణా విపశ్చితా' అను శ్రుతి ప్రవర్తించినది.

బ్రహ్మతత్త్వజ్ఞానము గలపురుషుఁడు అఖండనిత్యజ్ఞానస్వరూపముయిన బ్రహ్మము తానే యగు సకలమయిన కామములను పొందునని శ్రుత్యర్థము. లోకములో భోగము లనుభవించుటవలనను నాభోగములవిషయమగు నిచ్ఛ లేకుండుటవలనను అకామహతత్వము కామప్రాప్తి యనఁబడును. సర్వభోగములయందు వినాశాదిదోషములను జూచుచున్న తత్త్వజ్ఞానికి సర్వభోగములయం దిచ్ఛ కలుగనందున సర్వత్ర అకామహతత్వము కలిగియుండును. కనుకనే సార్వభౌమమహారాజును ఆరంభించి హిరణ్యగర్భునివరకు నుత్తరోత్తర శతగుణాధిక్యముతోఁ జెప్పఁబడినయానందములయందు 'శ్రోత్రియస్య చాకామహతస్య' అని వినఁబడుచున్నది. సర్వభోగములయందు నిచ్ఛలేని శ్రోత్రియుఁడైన విరక్తునికి నీయానందము కలదని శ్రుత్యర్థము.

సద్రూపముచేతను చిద్రూపముచేతను ఆనందరూపముచేతను సర్వపదార్థములయందు ననుగతమయియున్న స్వస్వరూ

పము ననుభవించువానికి సర్వభోక్తృత్వము కలదని తైత్తిరీయోపనిషత్తులో వినఁబడుచున్నది.

శ్రు. అహమన్న మహమన్నమహమన్నం. అహమన్నాదో౽హమన్నాదో౽హమన్నాదః. అని.

తా. బ్రహ్మాత్మైకత్వజ్ఞానము గలిగి ముక్తినొందినపురుషుఁడు తనకృతార్థత్వమును భావించి విస్మయముతో అద్వితీయమయి, నిరంజనమయిన ఆత్మను నేనే అయినప్పటికిని, ఈలోకమునందుఁ గల అన్నమును (భోగ్యమును), అన్నాదుఁడను (భోక్తను) నేనే యని అనుసంధించుచుండు నని శ్రుత్యర్థము.

కృతకృత్యత్వము స్మృతియందు స్మరింపఁబడినది.

శ్లో. జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్.

తా. పరబ్రహ్మతత్త్వజ్ఞానముచేత తృప్తి నొంది కృతకృత్యుఁడయిన యోగికి కర్తవ్యమయిన విషయము ఏమియు నుండదు. ఉండెనో, అతఁడు తత్త్వవేత్తయే కాఁడు.

శ్లో. యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే.

తా. ఏపురుషుఁడు ఆత్మస్వరూపమునందే రతిగలవాఁడై యుండునో, ఉద్యానాదులయందు రతిగలవాఁడై యుండఁడో, ఆత్మచేతనే తృప్తినొందునో, అన్నాదులచేత తృప్తి నొందఁడో, ఆత్మయందే సంతోషమునొందుచుండునో, పుత్త్రధనాదిప్రాప్తిచే సంతోషము నొందఁడో, అట్టితత్త్వజ్ఞాని యయిన పురుషునకు కర్తవ్యము కొంచెమయినా కలిగియుండదు.

శ్రు, 'అభయం వై జనక ప్రాప్తోఽసి' 'తస్మాత్తత్సర్వమభవత్' 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి.'

అనుశ్రుతులచేత ప్రాప్తప్రాప్యత చెప్పఁబడి యున్నది. ప్రాప్తప్రాప్యత అనఁగా పొందఁదగిన యర్థములన్నియుఁ బొందఁబడియుండుట. ఓజనకమహారాజా, నీవు సర్వపురుషార్థశ్రేష్ఠమయిన అభయమును మోక్షమును పొందితివి. ఇఁకను నీవు పొందవలసిన విషయము మఱియొకటి లేదు కనుకనే సర్వాత్మక బ్రహ్మస్వరూపుఁడాయెను. ఏపురుషుఁడు సత్యజ్ఞానానందాద్వితీయ పరమాత్మను నేనే యని ప్రత్యక్షముగాఁ దెలియునో ఆపురుషుఁడు బ్రహ్మమే యగు నని మూఁడు శ్రుతుల కర్థము.

ఆక్షేపము—ఓయీ, యీ చెప్పఁబడిన దుఃఖనాశ సుఖప్రాదుర్భావములు రెండును తత్త్వజ్ఞానముచే సిద్ధించుచుండఁగా జీవన్ముక్తియొక్క ప్రయోజనము లని చెప్పుట న్యాయము కాదు.

సమాధానము— సురక్షితము లైన దుఃఖనాశసుఖప్రాదుర్భావములు జీవన్ముక్తికి ప్రయోజనము లని మాయభిప్రాయమై యున్నది. అనఁగా తత్త్వజ్ఞానము పూర్వమే పుట్టియున్నప్పటికి జీవన్ముక్తిచేత నేప్రకారముగా రక్షింపఁబడునో ఆప్రకారమే దుఃఖవినాశసుఖప్రాదుర్భావమును కూడ తత్త్వజ్ఞానముచే సిద్ధించినప్పటికి జీవన్ముక్తిచేత రక్షింపఁబడును. ఇట్లు రక్షితము లైన దుఃఖవినాశ సుఖప్రాదుర్భావములు జీవన్ముక్తికి ప్రయోజనములని చెప్పుట న్యాయవిరుద్ధము కాదని తాత్పర్యము.

నను హృదయమునందు గలుగు శీతలత్వము అనఁగా; రాగ ద్వేషాదిశూన్యత్వము గలదో అదియు సమాధి యని చెప్పఁ బడును.

శ్లో. దృశ్యైర్న [illegible] బాధ్య ఇతి నిశ్చిత్య శీతలః,
[illegible]

తా. దృశ్యవస్తువు లన్ని కల్పితములగుటచేత వానితో నెట్టి సంబంధము నాకు లేదని తలఁచి అంతఃకరణమునందు రాగ ద్వేషాదిశూన్యత్వము కలవాఁడై యొకపురుషుఁడు లోకవ్యవహారములను యథేచ్ఛముగా నాచరించుచుండును. మరి యొకఁడు సమాధినిష్ఠుఁడై యుండును.

శ్లో. ద్వావేతౌ రామ [illegible],
అంతశ్శీతలతా [illegible].

తా. వీరిద్దఱు అంతఃకరణమునందు శీతలత్వము కల వారై యుండిన, నిండుగ సమానులుగానే యుందురు. అంతశ్శీతలత్వ మనునది అనేక తపస్సులయొక్క ఫలము.

సమాధానము—ఇది దోషము కానేరదు. ఇచ్చట నుదాహరించిన వసిష్ఠసంవాదవాక్యములయందు వాసనాక్షయ రూపమైన యంతశ్శీతలత్వము నవశ్యముగా సంపాదింపవలయు నని ప్రతిపాదింపఁబడియున్నది గాని వాసనాక్షయానంతరము సంపాదింపఁదగిన మనోనాశము శ్రేష్ఠము కాదని చెప్పియుండ లేదు. శీతలత్వ మనఁగా తృష్ణాదివాసనానివృత్తి యని వసిష్ఠ మహర్షియే స్పష్టపఱచియున్నారు.

శ్లో. అంతశ్శీతలతాయాం తు లబ్ధాయాం శీతలం జగత్,
అంతస్తృష్ణోపతప్తానాం దావదాహమయం జగత్.

తా॥ హృదయమునందు శీతలత్వము పుట్టినయెడల యీజగత్తు శీతలమై యుండి హృదయములో హాయిని కలుగఁజేయును. తృష్ణయనఁగా ఆశ. ఆయాశచేత హృదయమునందు బాధింపఁబడువారికి దవాగ్నివలె నీజగత్తు విదాహమును పుట్టించును.

ఇందుచేత తృష్ణాదిదోషములు హృదయములో లేకయుండుటయే అంతశ్శీతలత్వ మని చెప్పఁబడుచున్నది.

ఇంకను—శ్రీరామవసిష్ఠ సంవాదవాక్యములయందే సమాధినిందయును, లోకవ్యవహారముయొక్క ప్రశంసయును కనుపడుచున్నది.

శ్లో. సమాధిస్థానకస్యాపి చేతశ్చేద్వృత్తిచంచలం,
తత్తస్య తు సమాధానం సమమున్మత్తతాండవైః.

తా॥ సమాధియందు చేరిన పురుషునియొక్క చిత్తము విషయాంతరములను గ్రహించువృత్తులచేత చంచలమై యుండెనా, ఆపురుషునియొక్క సమాధి పిచ్చివాఁడు చేయు తాండవములో సమానమై యుండును. అనఁగా నిష్ప్రయోజనమని భావము.

శ్లో. ఉన్మత్తతాండవస్థస్య చేతశ్చేచ్ఛాంతవాసనం,
తత్తస్యోన్మత్తనృత్యం తు సమం బ్రహ్మసమాధినా.

తా॥ పిచ్చివానినృత్యమువలె నిష్ప్రయోజనమయిన లోకవ్యవహారము ననుష్ఠించు పురుషునియొక్క చిత్తము వాసనాక్షయము గలిగియుండెనా, ఆపురుషునియొక్క లోకవ్యవ

వాఁడై యుండి మనోవిశ్రాంతి నపేక్షించుపురుషుఁడు విద్వత్స
న్న్యాసమున కధికారి. ఇట్టి అధికారము గలిగినతరువాత నని
యైనా అథశబ్దమున కర్థమును చెప్పవచ్చును. యోగులయిన
పరమహంసపరివ్రాజకులయొక్క మార్గము స్థితియు నెట్టిది యని
నారదమహర్షి భగవంతుఁడైన హిరణ్యగర్భునిసన్నిధికి పోయి
అడిగె నని శ్రుత్యర్థము.

ఇప్పుడు కేవలయోగులనుగూర్చి కాని కేవల పరమ
హంసపరివ్రాజకులను గూర్చి కాని ప్రశ్న చేయఁబడినది కాదు.
ఇక నేమనఁగ యోగులైన పరమహంస లగువారిని గూర్చి
ప్రశ్న చేయఁబడినది.

కేవలయోగులు తత్త్వజ్ఞానము లేనందున కాలత్రయ
జ్ఞానము మొదలగునవి యున్నట్టి యోగైశ్వర్యచమత్కా
రమందు నిష్ఠులై, ధారణా ధ్యాన సమాధులను అణిమాది
సిద్ధులకొఱకే యనుష్ఠించుచుందురు. అందువలన పరమపురుషార్థ
మైన మోక్షమునుండి భ్రష్టు లగుదురు ఈయర్థమునం దిది
వరకే పాతంజలసూత్రము నుదాహరించి యున్నారము

ఈసూత్రార్థ మిచటనే వ్రాయఁబడియున్నది.

సూ. తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః. ౩౭.

కేవల పరమహంసపరివ్రాజకులు బ్రహ్మతత్త్వమును వివే
చించి తెలిసికొనియున్నందున యోగైశ్వర్యములయం దపార
త్వమును కనిపెట్టి వానియందు విరక్తులై యుందురు.

ఈయర్థమునందు ప్రమాణమును మునుపే యుదాహ
రించి యున్నారము.

తా. యోగిన్యైతత్త్వజ్ఞానముగల జీవన్ముక్తునికి మూర్ఖులతో సమానముగాని విశేష మిది యొకటియే కలదు. అది యేది యనఁగా బ్రహ్మలోకాంతైశ్వర్యములయందు అభిలాష లేనందున రాగము లేక నిర్మలమైయున్న మనస్సు కలిగి యుండుట.

శ్లో. విరాగ ఏవ ఖలు రాగవిలీనమూర్తే
స్పృంగారసంస్మృతివిరక్తమనస్స్వభావ్యా,
తజ్జన్య యస్య మనసో పరమోహ మోహా
లోభాభిమానముదితం విస్తృతం నిరస్తం.

తా. సరతత్త్వజ్ఞానసంపన్నుఁడును చిరకాలానువృత్తమైన సంసారభ్రాంతి శమించినందున సమసుఖుఁడైన జీవన్ముక్తునికి కామక్రోధమదమోహ లోభాదిదోషము లన్నియు ప్రతి దినము క్షీణించిపోవుట గలుఁగును.

ఇట్లు యతియోగములో నాఁడు వెనుక చెప్పిన రెండు దోషములు లేని మహాపురుషునియొక్క మార్గమును స్థితియును నారదమహామునిచే నడుగఁబడెను.

దేహభావాదిరాహిత్యవ్యవహారము మార్గ మని చిత్తశాంతి రూపమనోధర్మము స్థితి యని చెప్పఁబడును.

ఈప్రకారముగా నారదమహామునిచేఁ జేయఁబడిన ప్రశ్నమునకు భగవంతుఁడైన చతుర్ముఖబ్రహ్మ ప్రత్యుత్తరమును చెప్పుచున్నారు. అందులో ముందుగా దాను చెప్పఁబోవు మార్గమునందు శ్రద్ధాతిశయమును పుట్టించుటకుఁగాను మార్గమును స్తుతించుచున్నారు.

శ్రు. తం భగవానాహ సోఽయం పరమహంసానాం ముఖ్యోమార్గః. లోకే దుర్లభతరో న తు బాహుళ్యం.

తా. నారదునిఁగూర్చి చతుర్ముఖుఁడు చెప్పుచున్నాఁడు. ఈముందు చెప్పఁబోవునది పరమహంసలయొక్క ముఖ్య మార్గము.

ఇది లోకములో నింపు దుర్లభము. ప్రచురముగా లేదు.

శ్రుతిలో 'సః' అనుశబ్దముచేత నేమార్గము అడుగఁబడెనో, అది పరామర్శింపఁబడినది. 'అయం' అను శబ్దముచేతను ముందుగ్రంథములో చెప్పఁబడు దండాద్యాచ్ఛాదనాదిరూపములు స్వశరీరోపభోగములచేతను లోకోపకారముచేతను నిరపేక్షమయిన ముఖ్యమార్గము పరామర్శింపఁబడుచున్నది. పరమ కాష్ఠను బొందిన ముఖ్యమైనమార్గము లోకములో నెచ్చటను కనుపడనందున నీమార్గము దుర్లభ మని చెప్పఁబడినది. లోకములో నెచ్చటను కనుపడకపోయినమాత్రమున నీమార్గము అత్యంతాభావ మని శంకింపఁదగ దను నభిప్రాయముతో న తు బాహుళ్య మనుశబ్దముచేత నీమార్గము ప్రచురముగా లేదని చెప్పినది.

ఓయీ! యీమార్గము దుర్లభమయినపక్షమునను దాని వలన ప్రయోజనము లేనందున దానినిమిత్తమయి ఆయాసము చేయఁదగదు అని శంకించుకొని చెప్పుచున్నారు.

శ్రు. యద్యేకో భవతి స ఏవ నిత్యపూతస్థః, స ఏవ వేదపురుష ఇతి విదుషో మన్యంతే.

ఆక్షేపము.—ఓయీ తత్త్వవేత్తకు కూడ విధిబద్ధత కలదని చెప్పితే విధిజన్యమయిన అపూర్వమువలన జన్మాంతరము కూడ సంభవించును. అనఁగా శ్రు. 'అహరహస్సంధ్యాముపాసీత' యావజ్జీవ మగ్నిహోత్రం 'జుహోతి' ఇత్యాది విధివాక్యముల ననుసరించి చేయఁబడు సంధ్యావందనాగ్నిహోత్రాది కర్మలవలన సంభవించు పుణ్యమువలన జన్మాంతరము కలుగునని భావము.

సమాధానము.—విధిననుసరించి తత్త్వవేత్తలచేత చేయఁబడు నిత్యనైమిత్తికకర్మలవలన నపూర్వము పుట్టును గాని ఆ యపూర్వమునకు జన్మాంతరము ఫలము కానేరదు. చిత్తవిశ్రాంతికి ప్రతిబంధకము లైన పాపములను నివారించుటయే ఫలము. కర్మకుఁ గాని కర్మజన్యాపూర్వమునకుఁ గాని ప్రత్యక్షఫలము సిద్ధించుచుండఁగా అప్రత్యక్షఫలమును కల్పింపఁదగదని న్యాయవేత్తలు చెప్పుచున్నారుగనుకనే 'వ్రీహీనవహన్యాత్' అనువాక్యమునందు అవహననమును(దంచుటయను) కర్మకు ప్రత్యక్షమయిన తండుల సంపాదనమే (బియ్యమును జేయుటయే) ఫలము గాని అగ్నిహోత్రాది కర్మలకు వలె అప్రత్యక్షమయిన స్వర్గాదులు ఫలము కావని చెప్పియున్నది. 'అగ్నిహోత్రాదితు తత్కార్యాయైవతద్దర్శనాత్' అనుసూత్రమందీయర్థము విస్పష్టముగా చెప్పఁబడియున్నది. తత్త్వవేత్తవలన ననుష్ఠించఁబడు అగ్నిహోత్రాది కర్మలు తత్త్వజ్ఞానము నే ఫలమును కలుగఁ జేయునో అఫలమునే కలుగఁజేయును గాని జన్మాంతరప్రాప్తి మొదలైన ఫలాంతరములను కలుగఁ జేయవని సూత్రార్థము. కనుక శ్రవణాదివిధి

జన్యమైన యపూర్వము జ్ఞానోత్పత్తిప్రతిబంధకములయిన పాప
ములను నివారించి యేప్రకారము తత్త్వజ్ఞానమును గలుగఁజే
యునో, జన్మాంతరమును గలుగఁజేయదో, యాప్రకారమే శిఖా
యజ్ఞోపవీతత్యాగాదివిధిజన్యమైన యపూర్వముకూడ చిత్తవి
శ్రాంతిప్రతిబంధకములను నివారించి చిత్తవిశ్రాంతిని కలుగఁజే
యును గాని జన్మాంతరమును గలుగఁజేయదు.

కనుక విధిని సంకోచింపఁజేయుటకు దోషము లేనందున
తత్త్వజ్ఞానేచ్ఛవలన సన్యసించుగృహస్థునివలె తత్త్వజ్ఞానము
గలిగి సన్యసించు గృహస్థుఁడును నాందీముఖశ్రాద్ధము
ఉపవాసము జాగరణము మొదలయిన విధుల ననుసరించియే
సన్యసింపవలయును.

విచారించఁగా విద్వత్సన్యాసమును విధించిన శాస్త్రము
నందు నాందీముఖశ్రాద్ధాది ధర్మములను విధించి యుండలేదు.
అయినా, యీవిద్వత్సన్యాసము వివిదిషాసన్యాసముయొక్క
వికృతి అయినందున వివిదిషాసన్యాసములోఁ జెప్పిన యావ
ద్ధర్మములు విద్వత్సన్యాసమునందు "ప్రకృతివద్వికృతిః కర్త
వ్యా" అనున్యాయప్రకారము అతిదేశముచేత సంభవించును.

శ్రౌతకర్మలలో సర్వాంగములను ప్రతిపాదించి విధించిన
కర్మలు ప్రకృతులని, కొన్ని అంగములనుమాత్రము ప్రతిపాదించి
విధించిన కర్మలు వికృతు లని చెప్పఁబడును. అందులో నేకర్మ
యేకర్మయొక్క వికృతిగా నుండునో ఆ ప్రకృతికర్మయొక్క
ధర్మము లన్నియు వికృతికర్మలో ననుష్ఠేయములుగా ప్రాప్తిం
చును.

ఇందుకు దృష్టాంతము.—దర్శపూర్ణమాసములలోని ఆగ్నే
యయాగము ప్రకృతికర్మ. దీనియందు యాజమానాంగములు విధిం
పఁబడియున్నవి. శ్రు. *'సౌర్యం చరుం నిర్వపేద్బ్రహ్మవర్చసకా
మః' అనుశ్రుతిచేత విధింపఁబడిన సౌర్యయాగము వికృతికర్మ.
దీనియందు యాజమానాంగములు విధింపఁబడియుండలేదు. ద్రవ్య
దేవతాఫలములు మాత్రము విధింపఁబడియున్నవి.
ఇచ్చట †సౌర్యయాగము ఆగ్నేయయాగమునందలె నాచరింపఁ
దగియున్నది. ఈయర్థము సూ. 'అవిధర్మ్యాత్తేః పూర్వవత్త్వం'
అను జైమినిసూత్రముచేఁ జెప్పఁబడియున్నది.

కనుక విధివాక్యములందువలె విద్యోపాసనాప్ర
సమునందు కూడ శ్రుతిబోధ్యావశ్యములుగా పుత్రమిత్రాది
త్యాగమును సంకల్పించవలయును. శ్రుతియందుఁగల బంధ్వాది
శబ్దములలోని ఆదిశబ్దముచేత భృత్యులు పశువులు క్షేత్రములు
గృహములు మొదలైన లౌకికవిషయములు చెప్పఁబడుచు
న్నవి. 'స్వాధ్యాయం చ' అను పదమందుఁగల చకారముచేత
వేదార్థముల నిర్ణయించుటకు ఉపయుక్తములైన తర్క-వ్యాక
రణ మీమాంసాశాస్త్రములు వేదోపబృంహణములగు నితి

*బ్రహ్మవర్చసమును కోరిన పురుషుఁడు సూర్యదేవత నుద్దేశించి చరుద్ర
వ్యముచేత యాగము చేయవలయు నని శ్రుత్యర్థము.

†సౌర్యయాగమునకు ప్రత్యేకముగా ననుష్ఠానక్రమమును బోధిం
చనందున ప్రకృతికర్మమగు ఆగ్నేయయాగముయొక్క అనుష్ఠానక్రమమునే
యంగీకరించవలయునని సూత్రార్థము.

గ్రహింపవలయును. 'ఆచ్ఛాదనంచ' అనుపదమునందున్న చకారము పాదుకలు మొదలయిన మఱికొన్నింటిని గ్రహింపవచ్చునని తెలియఁజేయుచున్నది.

శ్లో. కౌపీనయుగళం వాసః కంథాం శీతనివారిణీం,
పాదుకే చాప్యుపాదద్యాత్కుర్యాన్నాన్యస్య సంగ్రహం.

అనుస్మృతి యీయర్థమును వివరించుచున్నది.

తా. రెండు కౌపీనములను ఒక కాషాయవస్త్రమును చలినివారించు బొంతను పాదుకలను గ్రహింపవలయును. ఇంతకంటె నితరమైనవాటిని గ్రహింపఁగూడదని స్మృతియొక్క యర్థము.

కౌపీనాదుల గ్రహించుటయును స్వశరీరోపభోగపరోపకారములకొఱకే కాని ఆత్మజ్ఞానోపకారముకొఱకుఁగాదు. కౌపీనముచేత లజ్జను, దండముచేత సర్పాద్యుపద్రవమును, ఆచ్ఛాదనముచేత చలిని, ఎండను, పాదుకలచేత నుచ్ఛిష్టదేశస్పర్శమును నివారించుకొనుటయే స్వశరీరోపభోగమని దండకాషాయాదిచిహ్నములను జూచి తనయొక్క యుత్తమాశ్రమమును నిశ్చయించుకొని తనను నమస్కారభిక్షాప్రదానాదిసత్కారములను చేసి లోకులు సుకృతమును పొందుటయె పరోపకారమనియుఁ దెలియవలయును. ఇదిగాక, అనాదిశిష్టాచారప్రాప్తమయిన సన్యాసాశ్రమమర్యాదను పరిపాలించుటయును పరోపకారమని తెలియవలయును.

ఈవిద్వత్సన్యాసికి కౌపీనాదిపరిగ్రహము అనుకల్పమే కాని ముఖ్యము కాదని శ్రు. 'తచ్చ నముఖ్యోసి' అని నిషేధించుచున్నది.

తా. కౌపీనదండాదులను పరిగ్రహింపవలయునని వెనుక చెప్పినది యీపరమహంసన్యాసికి ముఖ్యము కాదు. అముఖ్యమే యని భావము.

వివిదిషాసన్యాసికి మాత్రము దండకాషాయాదిగ్రహణము ముఖ్యము. కనుకనే వివిదిషాసన్యాసికి దండాది వియోగ మెప్పటికిని తగ దని నిషేధింపఁబడియున్నది.

శ్లో. దండాత్మనోస్తు సంయోగస్సర్వదైవ విధీయతే,
న దండేన వినా గచ్ఛే దిషుక్షేపత్రయం బుధః.

తా. దండమునకును శరీరమునకును సంయోగము సన్యాసికి సర్వకాలములయందు కలిగియుండవలయును. దండమును విడిచి మూఁడు బాణములు పాఱెడి మార్గమునైనా నడువఁ గూడదు.

'దండత్యాగే శతం చరేత్' అని దండము విడిచితే నూఱుప్రాణాయామములను ఆచరించి ప్రాయశ్చిత్తమును చేసుకొనవలయునని కూడ చెప్పియున్నది. యోగియైనపరమహంస యొక్క ముఖ్యకల్పమును ప్రశ్నోత్తరములచేత శ్రుతి చూపుచున్నది.

శ్రు. యోఽయం ముక్త్వా ఇతి వేదనం ముక్త్వా న దండం న శిఖాం న యజ్ఞోపవీతం నాచ్ఛాదనం చరతి పరమహంసః. శ్రు.

తా. యోగియైన పరమహంసన్యాసికి ముఖ్యకల్ప మేది యనఁగా దండమును గాని శిఖను గాని యజ్ఞోపవీత

శీతోష్ణసుఖదుఃఖ మానావమానములు గలుగనేరవు. ఊర్మి
షట్కమును కలుగనేరదు.

క్షుత్తు (ఆఁకలి), పిపాస (దాహము), శోకము, మోహ
ము, జర (ముసలి), మరణము ననియాఱు ఊర్మిషట్కమనఁ
బడును. ఈయాఱింటిలో క్షుత్పిపాసలు ప్రాణధర్మములు. శోక
మోహములు మనోధర్మములు. జరామృత్యువులు దేహధర్మ
ములుగనుక పరిశుద్ధాత్మస్వరూపనిష్ఠుఁడగు పరమహంససన్న్యా
సికి ఈయాఱు ద్వంద్వములు కలుగ నేరవని నిశ్చయము

సమాధియందు శీతోష్ణ మానావమానములు లేక
పోయినా, వ్యుత్థానసమయందు వివేకము లేనివానివలె
నీపరమహంసను కూడ నిందాక్షేపము బాధించు నని శంకిం
పఁగా శ్రుతి పరిహరించుచున్నది.

శ్రు. [illegible]
[illegible]

తా. విరోధులయిన పురుషులు తనయందు దోషముల
నారోపించి చెప్పుట నింద. అన్యులకంటె తాను అధికుఁడని తలఁ
చుటగర్వము, విద్యాధనాదులచే నధికులైన వారినిజూచి తాను
కూడ విద్యాధనాదులచేత వారితో సమానముగా నుండవలె
ననుబుద్ధి మత్సరము; ఇతరులు మాననీయులనని తనయొక్క
జపధ్యానాదికర్మల నితరులెఱుఁగుట నాచరించుట దంభము;
ఇతరులను తర్జన భర్త్సనలచేత తిరస్కరించుట దర్పము; ధన
క్షేత్రాదులయందభిలాషయే ఇచ్ఛ; శత్రువధాదులయందు బుద్ధి
ద్వేషము; అనుకూలములైన ద్రవ్యగృహక్షేత్రాదులయొక్క

నను వాసనకూడ నివర్తించియున్నందున పంచమహాజ్ఞానములు తిరిగి వ్యవహరింపఁబడవు. పంచమహాజ్ఞానములు సర్వప్రకారములవలన ననువర్తింపనేరవను నభిప్రాయముననే యిచ్చట యోగిని నిత్యనివృత్తుఁడని చెప్పెను. అజ్ఞానతత్కార్యములయొక్క నివృత్తి ఉత్పన్నమయినందున నేది యుత్పన్నమో అది నశించునను లోకన్యాయము ననుసరించి నశించునని యూహింపఁదగదు. *తార్కికమతమందు ప్రధ్వంసాభావము ఉత్పత్తికలది అయినప్పటికి నే ప్రకారము నశింపదో ఆ ప్రకారమే యీయజ్ఞానాదినివృత్తియును నశింపనేరదు. అజ్ఞానాదినివృత్తి నిత్యమైయుండు ననుటకు హేతువు చెప్పఁబడినది.

*తార్కికుల మతమందు ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అన్యోన్యాభావము, అత్యంతాభావము నాలుగు అభావపదార్థములు. ఘటముయొక్క ఉత్పత్తికి పూర్వము ఘటము లేకపోవుట ప్రాగభావమనఁబడును. ఇది అనాదిగానున్నప్పటికి ఘటము పుట్టగానే నశించును గనుక అనాదియైనది అనిత్యమని చెప్పఁబడును. నశించినతరువాత ఘటము లేకపోవుట ప్రధ్వంసాభావమనఁబడును. ఇది ఘటమందు హేతువైన ముద్గరాదులవలనఁ గలుగుచున్నందున ఉత్పత్తికలదైనప్పటికి మరల పోయిన ఘటము తిరిగి పుట్టనందున ప్రధ్వంసాభావము నిత్యముగా నుండును గాని నశింపదు. కనుక నే యుత్పన్నమో అది నిత్యము కాదను లోకన్యాయము, ప్రధ్వంసాభావమునందే వ్యభిచరించిన పదార్థములను చూచి ప్రవర్తించునని తార్కికుల సిద్ధాంతము. ఘటము పటమునందు, పటము ఘటమునందు లేకపోవుట అన్యోన్యాభావము. భూతభవిష్యద్వర్తమానకాలములలో, లేకపోవుట అత్యంతాభావము. ఇది శశశృంగాదులయొక్క అభావము.

ప్ర. తద్విద్యాబోధః. ౫౬.

ఇప్పు డీ శ్లోకము సర్వసాధనశ్రేష్ఠమైనందున సర్వవేదాంతప్రసిద్ధమగు యోగమార్గమును జెప్పుచున్నది. ఆ యోగమార్గమందనిత్యమై అవిచ్ఛిన్నమైన జ్ఞానముగల యోగి *'తన్నిత్యబోధః' అని చెప్పఁబడుచున్నాఁడు. యోగిశ్రేష్ఠుఁడు పరమహంస 'తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః' అను శ్రుతి ననుసరించి యోగాభ్యాసముచేత చిత్తవిక్షేపములు నన్నిటిని నివర్తింపఁ జేసుకొని నిరంతరముగా పరమాత్మవిషయమగు జ్ఞానము గలవాఁడై యుండును. కనుక జ్ఞానము నిత్యముగా నున్నందున జ్ఞానముచేతఁ జేయఁబడిన యజ్ఞానతద్వాసనానివృత్తియును నిత్యముగా నుండునని తాత్పర్యము.

ఇటుగాక వేదాంతమతమున 'భావాంతరమభావోఽన్యో న కశ్చి దనిరూపణాత్' అనున్యాయప్రకారము ఘటము యొక్క ఉపాదానమైన మృత్పిండము ప్రాగభావమని, ఉత్తరావస్థయైన శకలములు ప్రధ్వంసాభావమని చెప్పఁబడియున్నందున, అభావమనఁగా మరియొక భావపదార్థమే కాని మరియొకటి గాదని యంగీకరించియున్నందున రజ్జువునం దారోపింపఁబడిన సర్పముయొక్క నివృత్తి రజ్జుస్వరూపముగానే యున్నందున 'అధిష్ఠానావశేషో హి నాశః కల్పితవస్తునః' అనున్యా

* వేదాంతవాక్యశ్రవణమువలన పరమాత్మను చక్కఁగా తెలుసుకొని తరువాత నిదిధ్యాసనము చేసి ప్రత్యక్షముగా తెలుసుకొనవలయునని ప్రశ్నార్థము.

యమువలనను బ్రహ్మయం దారోపింపఁబడిన అజ్ఞానవాస నాదులయొక్క నివృత్తి బ్రహ్మస్వరూపముగానే యున్నది గనుక అది నిత్యమని చెప్పటకు నిం[illegible] యుక్తము.

ఈ—వేదాంతమహావాక్యవిచారముచేతఁ దెలియఁబడుపరమాత్మ తార్కికులచేతఁ జెప్పఁబడిన యీశ్వరునివలె జీవులకంటె భిన్నుఁడా! యను శంకను నివారించుచున్నది.

ప్ర. [illegible]. ఇతి.

తా. యోగియైనవాఁడు [illegible] వేదాంతవేద్యమైన పరబ్రహ్మమేది కలదో అది నేనే కాని నాకంటె భిన్నమైనది లేదని నిశ్చయించుకొనును అని యర్థము.

ఈ—యోగియొక్క బ్రహ్మానుభవప్రకారము చూపఁబడుచున్నది.

ప్ర. [illegible]. ఇతి.

తా. 'తం, శాంతం, అచలం' అను మూఁడుపదములయందు ద్వితీయావిభక్తిని ప్రథమావిభక్తిగా నన్వయించవలయును. కామక్రోధాదిదోషము లేనిదై గమనాగమనాది క్రియాశూన్యమై సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమై అఖండసచ్చిదానందరూపమయిన యేపరమాత్మ కలదో అపరమాత్మ నేనే. అపరమాత్మతత్త్వమే నాయొక్క వాస్తవస్వరూపముగాని కర్తృత్వభోక్తృత్వాదివికారములుగలస్వరూపముగాదు. వికారవంతమైనస్వరూపము మాయాకల్పితము.

'ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి' యను శ్రుతి యిందుకు ప్రమాణము. ఈపరమానంద స్వరూపుఁడయిన పరమాత్మ యొక్క స్వల్పాంశమును అవలంబించి దేవతిర్యఙ్మనుష్యాదిభూతములు సుఖము ననుభవించు చున్నవి యని శ్రుత్యర్థము.

ఇట్టి యభిప్రాయముతోనే ఆథర్వణికులు బ్రహ్మోపనిషత్తులో చెప్పుచున్నారు.

శ్లో. సశిఖం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః,
యదక్షరం పరం బ్రహ్మ తత్సూత్ర మితి ధారయేత్.

తా. బ్రహ్మతత్త్వజ్ఞానముగల పురుషుఁడు శిఖతోఁగూడ క్షౌరమును చేసుకొని బాహ్యమగున కనుఁడు యజ్ఞోపవీతమును త్యజించవలయును. వినాశము లేక నిత్యముగానుండు పరమాత్మనే బ్రహ్మసూత్రముగాఁ ధరించవలయును.

శ్లో. సూచనాత్సూత్రమిత్యాహుః సూత్రం నామ పరం పదం,
తత్సూత్రం విదితం యేన స విప్రో వేదపారగః.

తా. సమస్తార్థములను సూచించుటచేత సూత్రమని పెద్దలు చెప్పెదరు. అట్టి సమస్తార్థసూచకమయిన సూత్రము పరమాత్మ స్వరూపమేగాని మరియొకటి గాదు. అట్టిసూత్రమును ఏ బ్రాహ్మణుఁ డెఱుఁగునో అతఁడు సమస్తవేదముల యొక్క అంతమును ఎఱిఁగినవాఁడని చెప్పఁబడును.

శ్లో. యేన సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ,
తత్సూత్రం ధారయేద్యోగీ యోగవిత్తత్త్వదర్శివాన్.

తా. దారమందు మాణిక్యములవలె నెవనియందు ప్రపంచము కూర్పఁబడియున్నదో ఆసూత్రమునే యోగియైనవాఁడు ధరించవలయును. అతఁడే యోగవేత్తయని, తత్వవేత్తయని చెప్పఁదగినవాఁడు.

శ్లో. బహిస్సూత్రం త్యజేద్విద్వాన్ యోగముత్తమమాస్థితః,
బ్రహ్మభావమిదం సూత్రం ధారయేద్యస్సచేతనః.
ధారణాత్తస్య సూత్రస్య నోచ్ఛిష్టో నాశుచిర్భవేత్.

తా. తత్వజ్ఞాని యగువాఁడు సర్వోత్తమమైన యోగము నాశ్రయించి బాహ్యముగా నుండు యజ్ఞోపవీత సూత్రమును త్యజించవలయును. పరమాత్మస్వరూపమగు సూత్రమును ధరించినవాఁడే చేతనుఁడు. బ్రహ్మసూత్రధారి యెప్పటికిని ఉచ్ఛిష్టదోషము గలవాఁడుగాని అపవిత్రుఁడుగాని కానేరఁడు.

శ్లో. సూత్రమంతర్గతం యేషాం జ్ఞానయజ్ఞోపవీతినాం,
తే వై సూత్రవిదో లోకే తే చ యజ్ఞోపవీతినః.

తా. బ్రహ్మతత్వజ్ఞానమే యజ్ఞోపవీతముగాఁగల యే యోగులకు బ్రహ్మసూత్ర మంతర్గతమైయుండునో వారే ఈలోకములో సూత్రము నెఱిఁగినవారనియు, యజ్ఞోపవీతము కలవారనియు చెప్పఁబడుదురు.

శ్లో. జ్ఞానశిఖా జ్ఞాననిష్ఠా జ్ఞానయజ్ఞోపవీతినః,
జ్ఞానమేవ పరం తేషాం పవిత్రం జ్ఞానముచ్యతే.

తా. ఎవరికి జ్ఞానమే సర్వాధికముగా నుండునో, వారు జ్ఞానమే శిఖగా కలవారుగా జ్ఞానమునందే, నిరంతరస్థితి

తా. పరమగతిప్రాపకమయిన యేబ్రహ్మతత్త్వజ్ఞానము కలదో, అదియె యజ్ఞోపవీతము. కనుకనే బ్రహ్మజ్ఞానము గలవాఁడే యజ్ఞోపవీతము కలవాఁడని చెప్పఁబడును. ప్రాజ్ఞులగువా రతనినే సకలయజ్ఞములు చేసినవాఁ డని చెప్పుదురు.

కనుక యోగికి శిఖాయజ్ఞోపవీతములు కలవు. ఆప్రకారమే సంధ్యయు కలదు. అహంప్రత్యయముచేత తెలియఁబడు జీవాత్మను కేవలశాస్త్రముచేతనే తెలియఁబడు పరమాత్మను భ్రాంతిచేత కలిగియున్న భేదము తత్త్వమస్యాదిమహావాక్యజన్యమైన అభేదజ్ఞానముచేత తిరిగి వృత్తిరూపమున నశించును. ఈయభేదజ్ఞానము జీవాత్మపరమాత్మలయొక్క సంధియందుఁ గలుగును గనుక సంధ్య యనఁబడును. అహోరాత్రములు రెంటియొక్క సంధియందుఁ గలుగుక్రియయే కదా సంధ్యయనఁబడునది. అహోరాత్రములయొక్క సంధియందుఁ గలిగినక్రియ సంధ్య యని చెప్పఁబడినట్లు జీవాత్మపరమాత్మలయొక్క సంధియందుఁగలిగిన అద్వైతజ్ఞానము సంధ్యయని చెప్పఁబడును. ఈప్రకారము పరమహంసకు కూడ శిఖాయజ్ఞోపవీతసంధ్యలు కలిగియున్నందున యోగి యగువాఁడు కర్మజడులచేత వ్యామోహమును పొందించుటకు శక్యుఁడు కాఁడు.

ఈప్రకారము పరమహంసయొక్కమార్గస్థితులను గూర్చి చేసిన ప్రశ్నలకు ప్రత్యుత్తరమును చెప్పి యిప్పుడు సమాప్తి చేయఁబడుచున్నది.

